# దుఃఖవిమోచనము

## (ఆరోగ్యరామభద్రము.)






—: గ్రంథకర్త :—

భాగవతుల నృసింహశర్మ.

వేగుంజుక్క గ్రంథమాల:—49

# దుఃఖవిమోచనము.

ప్రథమముద్రణము.

వెల 0-10-0

*Printed at*
*Sri Rama Press,*
*Berhampur, (Ganjam)*

# మనవి.

"దుఃఖవిమోచనము" లేక ఆరోగ్యరామభద్రమను నామమిడుటఁబట్టియే, యీగ్రంథమే యుద్దేశమున వ్రాయఁబడినదో తెల్లమగుచున్నది. యుద్ధకాండ మింతదనుక వెలువడుకుండుటకుఁ గారణమీగ్రంథపఠనానంతరమునఁ జదువరులెఱుంగఁగలుగుదురు. సాధ్యమైనంత శీఘ్రముగనే యుద్ధకాండము (శ్రీ తులసీరామాయణము) ప్రచురించుటకుఁ దగినంత ప్రయత్నము చేయుచున్నారము-శ్రీరాముని తోడ్పాటు, భక్తవరుల ప్రోత్సాహము మాకు లభించుఁగాక.

భక్తజన విధేయుఁడు,

భాగవతుల నృసింహశర్మ.

వేగుజుక్క గ్రంథమాల, పూడిపెద్దివారివీధి, బరంపురం, గంజాం

భాగవతుల నృసింహశర్మ విరచిత గ్రంథములు.

ఈగ్రంథములన్నియు నొకసారి కోరినయెడల విలువతగ్గింతుము - వెంటనే మాకు వ్రాయవలెను.

# శ్రీ తులసీరామాయణము.

## —: వెలువడిన భాగములు :—

| | | |
|---|---|---|
| (1) బాలకాండము - చిత్రపటశోభితము | ,, | 1-8-0. |
| (2) అయోధ్యాకాండము - 2 భా॥ | ,, | 1-8-0 |
| (3) ఆరణ్యకాండము | ,, | 1-0-0 |
| (4) కిష్కింధాకాండము | ,, | 0-12-0 |
| (5) సుందరకాండము | ,, | 0-12-0 |
| (6) లంకాకాండము | | 1-0-0 |

## ఇతరగ్రంథములు.

| | |
|---|---|
| (7) శృంగారసంధ్య | 1-0-0 |
| (8) రాయబారము | 1-8-0 |
| (9) అభినవభర్తృహరి | 0-10-0 |
| (10) గాంధిశతకము | 0-4-0 |
| (11) విజయవిజయము (నా ట క ము) | ప్రతులు లేవు |
| (12) ప్రతిజ్ఞావిజయరామరాజీయము (నాటకము) | 0-12-0 |
| (13) ప్రతిజ్ఞాచాణక్యము (నాటకము) | 1-0-0 |
| (14) రసపుత్రజీవనసంధ్య (నవల) | ప్రతులు లేవు |
| (15) శ్రీరాముని వైరాగ్యము | 0-4-0 |




# దుఃఖవిమోచనము.



మ॥ స్థిరభావంబున దుఃఖకారణమన శ్చింతన్ విసర్జించి, దు
ర్భరతాపత్రయహేతుభూతవిషయ వ్యామోహమున్ దక్కి, శాం
తరసావిష్కృతశుద్ధసత్వమును దుర్దాంతాఘభూయిష్ఠ సం
సరణాంభోనిధిపోతమున్ సగుణరామబ్రహ్మమున్ గొల్చెదన్.

తళుకుం జెక్కులమందహాసరుచి జ్యోత్స్నాకాంతి విభ్రాంతి భ
క్తులకామోదముఁ గూర్పఁ బద్మదళదృక్కోణంబులన్ ముజ్జగం
బలరన్ జేయు కృపారసంబొలుక, జ్ఞానాధీనమై గ్రాలు కో
మలసుశ్యామల దివ్యవిగ్రహము రామబ్రహ్మమున్ గొల్చెదన్.

ఉ॥ శాంతుని సర్వసద్గుణుని శాంతుని నాత్మకళాన్వితాఖిలా
శాంతుని సర్వలోకసుజనాశ్రితభక్తమనోంబుజాత భా
స్వంతుని మానిరాడ్వనవ సంతుని నానతదేవకాంతు శ్రీ
కాంతుని జానకీహృదయ కాంతుని సంతతమున్ స్మరించెదన్.

ఉ॥ భక్తులుసంస్మరించిన నెవండు శుభంబులనిచ్చు? నెవ్వఁడా
సక్తిని తన్నుఁగొల్చుజన సత్తముసంకటముల్ హరించు; ధీ
శక్తి యెవండు? నాదుభుజ శక్తి యెవండు? తలంపమన్మన
శ్శక్తి యెవండు? రాముఁడని సంతతమున్ శరణంబు వేఁడెదన్

శా॥ ఆపద్బాంధవుఁడెవ్వఁడా శ్రితజనవ్యాధిన్ మనోవ్యాధిసం
తాపంబున్ తొలఁగించువాఁడెవఁడులో ధ్యానించుమాత్రంబునన్
పాపప్రాప్త భయాంక రామయములన్ వారించువాఁడెవ్వఁడా
శ్రీపాలున్ రఘురాము సంతతమునా చిత్తంబునన్ గొల్చెదన్.

శా॥ నిన్నుందక్కమఱెవ్వరిన్ దలఁపనిన్నే నమ్ముకొన్నాఁడ నా
పన్నానీకశరణ్యయంచుమదినిన్ ప్రార్థించుచున్నాఁడ నో
యన్నా! నీపదపద్మముల్ సతతమునే ధ్యానింతు; నన్ దీనునిన్
మన్నింపందగు; నీదుభక్తుఁడను రామా భక్తసంరక్షకా.

శా॥ ఆచార్యుండవునీవయంచు నిజవిద్యాభ్యాసముం జేసితిన్,
ఆచంద్రార్కమునిల్చునట్లుకృతి నీకర్పించితిన్ భక్తితో
నీచారిత్రమువ్రాసి; నన్నుఁగరుణన్ వీక్షించిరక్షింపు నీ
యాచారంబుశ్రితావనంబుగద రామా భక్తసంరక్షకా.

శా॥ ఆరోగ్యంబునుభాగ్యమున్ సకలసౌఖ్యంబుల్ ప్రసాదింపఁగ
శ్రీరాముండొకగొప్పదైవమని నిన్ సేవించుచున్నాను; నా
ఆరోగ్యంబునునాకొసంగఁడగదా యశ్రాంతమున్ భక్తి ని
న్నారాధించెదుపాదసేవకుఁడ రామా భక్తసంరక్షకా.

ఉ॥ ఆమయబాధయుండునెయహర్నిశమున్ భవదీయదివ్యనా
మామృతమానువానికి, దయానిధి దాశరథీ యటంచు ని
న్నేమదిఁగొల్చుభక్తునకు నేమిట లోపములుండు? సద్గుణో
ద్ధామ!జనాభిరామ! పరితాపముఁబాపి యనుగ్రహింపుమా

శా॥ నాలోనున్ననినున్ గనుంగొనఁగ యత్నంబున్ విసర్జించి నీ
వోలోకంబుననున్నవాఁడవనిలోనూహించి శ్రీరామ రా
రాలక్ష్మీహృదయేశ్వరాయనుచు నిన్ ప్రార్థించుచున్నాఁడ న
న్నాలోకింపుము మూఢచిత్తుఁడనురామా భక్తసంరక్షకా.

ఉ॥ నీమహిమం బెఱింగి గమనింపఁగనెంతటివాఁడనోయి నీ
నామముసర్వదోషహరణంబని నమ్మిజపించుచుంటి, నేఁ
బామరుఁడన్ భవచ్చరణ భక్తియె తక్క నెఱుంగనన్యమున్
రామ! యనుగ్రహింపుము కరంబనురక్తి నినీకు మ్రొక్కెదన్

మ॥ ఘనకష్టంబులునష్టముల్ ప్రబలరోగంబుల్ నివారించి నా
కనపాయంబుగనంగరక్షకుఁడవై యశ్రాంతమున్ సత్కృపన్
ననుఁగాపాడకయున్ననీచరితమున్ వ్రాయంగ శక్తుండనే
అనఘుండన్ భవదీయభక్తుఁడను రామా భక్తసంరక్షకా.

మ॥ సదయాంతఃకరణంబుఁగల్గియుఁగటా సవ్యాపసవ్యంబులన్
తుదిఁజింతింపక కష్టనష్టములు తోడ్తోఁగూర్చి బాధించి నా
హృదయంబున్ బరికింపనెంచితివె నీవేరీతిఁ గావించినన్
మదినీధ్యానము నన్నుఁబ్రోచుఁజుమి రామా భక్తసంరక్షకా

మాధవ నీమహత్త్వము నుమాధవుఁడంతటివాఁడెఱుంగు, శ్రీ
నాథ! యనాథనాథ! కపినాథసమాదృతపాద! యోజగ
న్నాథ దిశాధినాథనుత నామ! శ్రితావనకామ! రామ! నా
బాధలణంచి నన్నుఁ గృపన్ దిలకింపుము నీకు మ్రొక్కెదన్.

శా॥ ఏరూపంబుఁగలట్టివాఁడవనియూహింతున్ నుతింతున్ నిరా
కారా! శ్రీకర! నిర్వికారయని; రోగంబుల్ నివారింపుమా,
ఏరీతిన్ మది సంస్మరించినను నీకే చెందు నంచెంచి ని,
న్నారాధింతు స్మరింతు సంతతము రామా భక్తసంరక్షకా.

శా॥ కేయూరాదిసువర్ణభూషలమెయిన్ గీల్కొల్పి సౌధాంతమం
దేయూరన్ నివసించువాఁడవనియూహింతున్ రమానాయకా
నాయీచిత్తమునందు లేవ? సగుణా నారాయణా వార్ధిలో
హాయిన్ నిద్రిలుచుంటివా? చెపుము రామా భక్తసంరక్షకా.

చం॥ జగములనెల్లబ్రోజ్జనొక చాయనిమిడ్చిన వాఁడవీవు; నిన్
ఖగపతిపృష్ఠభాగమునఁ గైకొనియేగు శ్రమంబులేక త
ల్పగతిరహించి శేషుఁడు భవత్తను భారమునైఁచె నీపుపై
మఁగనిన భక్తనర్యుల కమానుషశక్తిలభించు రాఘవా.

ఉ॥ బాపురెనాఁడు నిన్ గొలిచి వానరుఁడొక్కఁడు వార్ధిదాఁటి లం
కాపురికేగెనంచు విను గాథముగన్ మది సంస్మరించి నే
నేపుమెయిన్ రచించి కృతి నిచ్చితి నీకు భవచ్చరిత్రమున్;
శ్రీపతి నన్నుఁ బ్రోవుమతి శీఘ్రగతిన్ విలసత్కృపామతిన్.

ఉ॥ నీదయయున్నఁజాలునని నిత్యము నిన్ను స్మరించుచుంటి, నా
మీఁదభవత్కృపారస మమేయగతిన్ గురిపింపు, మిప్పుడీ
వాదటఁజూడవేని సదయా విరచింపఁగశక్యమౌనె లో
కాదృతమైన నీచరితమంతయు మాధవ వీరరాఘవా.

ఉ॥ కర్మముఁబట్టిజీవులకుఁ గష్టసుఖంబులు సంభవించు నీ
మర్మమెఱుంగుమంచునొకమాటవచించెదవేమొ? యట్లనన్
ధర్మమెచెప్పుమా నినుసతంబు భజించినలాభమేమి? న
న్నర్మిలిఁబ్రోవఁగావలె దయాంబుధి దాశరథీ సుధనిధీ.

శా॥ లబ్ధంబైనదినీవొసంగితనియే లాసంతసింపంగఁ? బ్రా
రబ్ధప్రాప్తమయైనఁగర్మసరణిన్ బ్రాపించు లోపించు; ధీ
స్తబ్ధుల్ భక్తులు నీపదాబ్జయుగళిన్ ధ్యానింపనింకేటికిన్?
లుబ్ధత్వంబునుదక్కి మేలొసఁగు మాలోచించి సీతాపతీ.

గీ॥ "అన్యథాశరణంనాస్తి" యనుచు నిన్ను
నాశ్రయించితి శ్రీరామ యఘ విరామ
నిన్నుఁగొలిచినవాని మన్నింపవలయు
భక్తసంరక్షకా! మాధవా! ముకుంద!

మ॥ తులసీదాసుఁడుపల్కినట్టికృతి నాంధ్రుల్ మెచ్చగా భక్త
త్సల! నీపేరరచింపఁగా మిగుల నుత్సాహించితిన్ గాక
న్నేలమిన్ బ్రోవక కష్టనష్టములు నాకీరీతిఁజేకూర్చినన్
అలవేపారఁగవ్రాయఁజాలఁజుమి రామా భక్తసంరక్షక

మ॥ తినికూర్చుందునె "దైవమేవశరణం ధిక్ ధిక్ వృథాపౌరుషం"
బని? నేనొప్పినయంత కార్యములఁ జేయన్ జంకనొక్కప్పుడేన్
వనటన్ మాలినఁగష్టనష్టములచే; వైరాగ్యమేవాభయం
బన్ వాక్యంబువహింతునన్ దలఁచి రామా భక్తసంరక్షకా.

శా॥ విశ్వాత్ముండవు విశ్వసంభవుఁడవున్ విశ్వేశనిన్ నెమ్మదిన్
విశ్వాసంబునఁగొల్చి దుఃఖములకున్ విశ్వాసమున్ బుచ్చితిన్
ఆశ్వాసింపుము హాః లేదనుచుఁ బేరాసన్ నినున్ గొల్వి య
ప్పైశ్వర్యంబులఁగోర లేదు గద రామా! భక్తసంరక్షకా!

శా॥ నన్నున్ మించిన భక్తశేఖరుల నెన్నన్ శక్యమానారు నీ
కున్నారుర్వి ననేకులందఱును నేనొక్కండ హీనుండ, నే
నున్నాఁడంచు భజింపఁగాఁదగిన నీవొక్కండవే వేల్పవో
యన్నా! నన్నుఁగనిమ్ముఁబ్రోవవలె రామా భక్తసంరక్షకా.

శా॥ స్వారాచారవిచారహేతువని నీచారిత్రమున్ వ్రాయఁగా
ప్రారంభించినదాదిఁ గష్టములు సంప్రాప్తింపఁగాఁజేసి నా
యారోగ్యంబును పాడుఁజేసితివి మర్యాదన్ విసర్జించి, యా
రౌరా యేమనవచ్చునిన్ను రఘురామా భక్తసంరక్షకా.

శా॥ ఆదిన్ నాదు ద్వితీయసోదరుని దేహంబున్ తొలంగించి యా
పై దేవీపదభక్తు నగ్రజుఁ దదద్భార్యన్ దివిన్ జేర్చి యా
మ్రాఁదన్ జ్యేష్ఠతనూజు మృత్యువునకున్ మేపించి దుఃఖంబులన్
ఆధివ్యాధులనాకుఁ గూర్చితివి రామా భక్తసంరక్షకా.

మ॥ అనిశంబున్ నినుఁగొల్చు భక్తులకు దేహారోగ్య భాగ్యోదయం
బౌనగూడున్ శుభముల్ ఘటిల్లునని యార్యుల్ పల్క నిక్కంబయా
నని కీర్తించితి నిన్ భజించితి మతిన్ ధ్యానించితిన్ బల్కితిన్
అనఘుంబాచు భవత్కృతిన్ ధృతినిరామా భక్తసంరక్షకా.

శర్వాదుల్ మునులున్ మహర్షులు మహాశాస్త్రజ్ఞులున్ పండితుల్
అర్వాచీనులు నాదిదేవునిగ నిన్ ధ్యానింతు రశ్రాంతమున్
"సర్వంవిష్ణుమయంజగత్త్"నెడు వాచారూఢి తథ్యంబ; కిం
కుర్వాణుండను నన్నుఁ జూడుము కృపన్ కోదండరామప్రభూ

ఉ॥ ఎన్నఁడు నిన్ స్మరింపకయ యేపనియైన నొనర్పలేదు నీ
సన్నుతి వీనులం బడినఁ జయ్యన మేన్ బులకించుఁగాదె, ని
న్నెన్నఁగ రాని భక్తి నుతియించి భజించి స్మరించుచుంటి నా
మన్ననలన్ గ్రహింపుమయ యు మాధవసన్నుత వీరరాఘవా!

మ॥ హనుమంతున్ తులసీకబీరుఘనుగోపన్నాఖ్యునిం బోతనా
ఖ్యుని వేమన్నను త్యాగరాజుసతమున్ గొండాడెదన్ రామభ
క్తిని పేరెన్నికఁగన్న వారలని నిన్ గీర్తించెదన్ గొల్చెదన్
అనిశంబున్ ననుబ్రోవుమంచు రఘురామా భక్తసంరక్షకా.

చూడన్ శుష్కమహోపవాసములకున్ శుష్కింపఁడొక్కింతయు
గీడుం బొందఁడు, దైన్యమొందఁడు మనః క్లేశంబులం గుంగి పో
రాడన్ జంకఁడు, కర్మచంద్రుఁడు భవద్ధ్యానానురక్తుండు కొం
డాడుం బోలదెవాని నిన్ను నుపమానా! రామ! భక్తావనా.

గీ॥ నీమనము రంజిలంజేయ నేమ మెఱుఁగ
సరససంగీతసాహిత్య సరణి యెఱుఁగ
మూఁగ నిగమంబులఁబల్కు పోల్కినొక్క
కవితఁబలికెద నదియు నీకరుణవలన
సద్గుణారామ శ్రీరామ సార్వభౌమ.

ఉ॥ భూతమయప్రపంచ పరిపూతము సర్వశుభప్రదంబునా
నీతనుమేఘదర్శనము నిత్యముఁగోరుచునుండు మన్మన
శ్చాతకపక్షికిం గల తృషఁ గరుణారసవృష్టిఁదీర్చి నీ
ఖ్యాతిసినిల్పుకొమ్ము సదయారఘునాయక సౌఖ్యదాయకా

ఉ॥ చిత్రము నీచరిత్రమని చిత్తమునందుఁ దలంచుచుండు లో
కత్రయిఁ గుక్షిఁగైకొనిన ఖ్యాతినిఁగాంచియునీవుభక్తహృత్
క్షేత్రములందునుందువని శిష్టులు పల్కఁగవిందు నిన్ను నే
స్తోత్రముఁజేయఁజాలనిదె దోసిలియొగ్గితి జానకీపతీ.

ఉ॥ సార్థకమేయగున్ రఘుకులాంబుధిచంద్రుని రామభద్రునిన్
మూర్ధమువంచిమ్రొక్కిసతమున్ గొనియాడిననంతమాత్రమున్
వ్యర్థముగాదు మానసమ యంచుఁగడుంగడు విశ్వసించి నిన్
ప్రార్థనఁజేయుచుంటిఁజుమి భక్తజనావన లోకపావనా.

ఉ॥ జ్ఞానములేనివాఁడయిన నైష్ఠికుఁడైనను గాకయుండినన్
స్నానమువేళ భోజనము నర్చెడువేళ ననంతరంబునన్
పానముసేయువేళ నిను భక్తిఁదలంచి భజించి నీపద
ధ్యానముసేయుభక్తులకు నాపద లుండవు జానకీవరా.

ఉ॥ పామరుఁడన్ జడుండఁ గడుబద్ధకముంగల
నేమమెఱుంగ సుంతయును నిష్ఠయెఱుంగ
మామృతమాని మైమఱచి యాత్మను నిన
స్తోమ! జనాభిరామ! భవ దుఃఖవిమోచన

ఉ॥ దేహమునందు స్వస్థత మదిన్ భవదీయప
దేహము లేనివర్తనము నిన్ను నుతింపఁ గవి
మోహము లేని జీవనముఁ బొందిక నాకున్
శ్రీహరదివ్యచిత్త సరసీరుహ భాస్కర జ

ఉ॥ ధన్యుఁడువాఁడెవండు నిజ ధర్మపథంబును
మాన్యుల విశ్వసింప కనుమానముఁదక్కి
దైన్యము లేని జీవనము దప్పక వానికిఁ జేక
అన్యవిచార మేల? సదయా రఘునాయక

ఉ॥ సారము లేదు చూడనరి షట్క సమావృ
సార మనేక దుఃఖముల సంతతమున్ ఘటిం
సారవిచారధీరకవిసత్తము లాత్మభజించు
శ్రీరఘురామచంద్ర! యతసీసుమ కోమల

గీ॥ వరధనుర్బాణ తూణీర భారమును
వచ్చి రక్షించుచుందువు భక్తవరులు
నిను స్మరించిన యంతనే నిరుపమాన
పతితపావననామ సంసృతి విరామ.

ఎవ్వఁడు బాంధవుండు సఖుఁడెవ్వఁడు తల్లియుఁదండ్రియున్ గురుం
డెవ్వఁడు సర్వభూతములు నెవ్వఁడు సత్వ రజస్తమో గుణుం
డెవ్వఁడు ధర్మమార్గచరుఁ డెవ్వఁడు భక్తులఁ జూచి ప్రోచువాఁ
డెవ్వఁడు నీవ యాచెలుఁగెఁ డెవ్వఁడు మాధవ వీరరాఘవా.

ఉ॥ శ్రీరఘురామ! దోర్బలవశీకృత భార్గవరామ! ఘోర సం
సారవిరామ! కామరిపుసన్నుతనామ! గుణాభిరామ! దు
ర్వారగతిన్ ఘటిల్లెడు విపత్తులఁ బాపి యనుగ్రహించి మా
యా రభసంబణంపుము శ్రితావన జీవన లోకపావనా.

గీ॥ బహుళరోగాపనోదనా వందనంబు
భక్తజన కార్యసాధనా వందనంబు
పాపభవ దుఃఖమోచనా వందనంబు
పద్మదళలోచనా రామ వందనంబు.

ఉ॥ పాపమొ పుణ్యమో విను భవత్పదభక్తి త్యజింపలేదు, నే
నోపియొ యోపకో రఘుకులోద్భవ! తావక సత్కథాసుధా
లాపము లాలకించి కృతులన్ విరచించుచునుంటి నాదు సం
తాపమణంగ దృష్టిఁగరుణా రసవృష్టిని గుమ్మరించి ఘో
రాపదఁ బాపుమింక సదయా రఘునాయక సౌఖ్యదాయకా

ఉ॥ వంతమువచ్చెనంచు నినుఁ బ్రార్థనఁ జేసినయంత నీవు నా
స్వాంతమునన్ రహించి బహుభంగులఁ దోడ్పడ రాయబారమున్
సాంతముగా నమోఘగతి నై దుదినంబులలో రచించి నీ
కెంత యు భక్తినిచ్చితివి గదే రఘునాయక సౌఖ్యదాయకా.

శా॥ పాపాత్ముండనో పాపహీనుఁడనో నీపాదాబ్జ సేవా కృతి
వ్యాపారంబునుదక్కనన్యమెఱుఁగన్ వంచించినాకాపదని
ఆపాదింపఁ దలంచు వంచకుల మాయావంచనా చాతురీ
వ్యాపారంబును సాగనీయకుము రామా భక్తసంరక్షకా.

శా॥ ఔరా సత్యముఁగప్పిపుచ్చి కపట వ్యాపారమే పారఁగా
వారిన్ వీరినిఁ దోడుఁజేసుకొని దుర్భాషా ప్రచారార్థియై
ఊరూరన్ దిరుగాడి చెప్పుకొనుఁబో యొక్కండు; తద్దుష్టక
ర్మారంభంబుఫలించునే తుదకు రామా భక్తసంరక్షకా.

శా॥ ధర్మాధర్మములన్ యథార్థసరణిన్ దర్కించి, మూర్ఖించి దు
ష్కర్మాసక్తిఁజరించు వంచకుని వీఁకన్ జోకఁ బోకార్చి నీ
పేర్మిన్ జూపి యనుగ్రహింపఁదగదే? విద్యావివాదంబులన్
మర్మంబంతయు నీవెఱుంగుదువు రామా భక్తసంరక్షకా.

ప్రేమోద్రేకముఁజూపుదంభమునకున్ విద్వాంసులున్ ముగ్ధులై
మోమోటంబునుబొంది నిక్కమగు నేమోయంచు విభ్రాంతి
నామోదింతురుగాక వంచకుని దుర్వ్యాపార మొక్కింత; నీ
వామర్మం బఖిలంబెఱుంగుదువు రామా భక్తసంరక్షకా.

ఉ॥ ఇచ్చకమాడికొందఱి నోకించుక విత్తమొసంగి కొందఱిన్
మెచ్చుకొనంగఁజేసి కయిమిన్నల యొంగిలిసంగ్రహించి తా
వచ్చియురాని బాసను సెబాసని పొత్తము వ్రాసినంతనే
రచ్చకునెక్కునే సుకవిరాజులు మెత్తురె జానకీవరా.

ఉ॥ ఒప్పిదమైనకావ్యమును నొప్పరికించి యనర్థవాక్కులన్
దప్పులకుప్పయయ్యుఁ గలతజ్ఞులు మెచ్చనిదయ్యు నక్కటా
మెప్పునకో ధనంబునకొ మేకొని చప్పనిపాత్రమున్ గడున్
గొప్పగఁజెప్పునాతఁడొక కోవిదుఁడైనఁ గవీంద్రుఁడైన నీ
వెప్పగిదిన్ సహింతువొ మహేశ్వర సన్నుత జానకీశ్వరా.

సీ॥ విశ్వకర్మను కడున్ విశ్వసింపఁగఁజేసి
యాదినారాయణు నాశ్రయించి
పార్వతీశ్వరు పాద పద్మంబులంబట్టి
రామచంద్రా యంచుఁ బ్రస్తుతించి
లక్ష్మికై లక్ష్మీశు లక్షించి వినుతించి,
యితరులఁగొల్చి నీచతకు నోర్చి
పరులు లోఁబడ వ్యర్థ వాగ్దానములఁజేసి
యిచ్చకంబుల నిచ్చి మెచ్చులిచ్చి

గీ॥ స్వప్రయోజనాపేక్షను సంచరించి
సత్యమును గప్పిపుచ్చు నసత్యవాది
దైత్యుఁడగుఁగాదె యాతఁడాదిత్యుఁడైన
సద్గుణారామ శ్రీరామ సత్యధామ.

చ॥ చదివిననేమి యాచదువు సార్థకమాగతి సంచరించి కో
విదుఁడు యథార్థమెట్టిదో వివేకమునన్ బరికించి ధర్మమున్
మదిని గ్రహించి వంచకులమాయలెఱింగి తృణీకరించినం
గద సదసద్వివేకియని ఖ్యాతికి నెక్కును జానకీవరా.

గీ॥ జనులఁగాపాడు సత్య మసత్యమునను
దైవగృహమగు ధర్మ మధర్మమునను
అంతరించిన నెవరికి హాని యగును
సభ్యులకుఁగాక శ్రీరామ సత్యధామ.

ఉ॥ దుర్గమ దుస్స్వభావయుత ధూర్తులకున్ గపటాత్ములైన దు
ర్మార్గుల కెంమఁదోడుపడి మాన్యులఁ గాసిలఁజేయునట్టి నీ
మార్గ మెఱుంగరాదయిన మాన్యక భక్తులఁబ్రోచు నీదు నై
సర్గికవృత్తి లోఁదలఁచి సన్నుతిఁజేసెతి జానకీపతీ.

ఉ॥ ఆదియుగంబులందు వివిధాకృతులన్ వసుధన్ జనించి ప్ర
హ్లాదవిభీషణాది సుకృతాత్ములఁ బ్రోచితివంచు నీదు మ
ర్యాద గణించి నిక్కమగునంచుఁ గడుంగడు విశ్వసించి నీ
పాదములన్ భజించెదను భక్తజనావన జానకీవరా.

ఉ॥ నీపదభక్తి యెట్టి యవినీతిపరున్ సుకృతాత్ముఁజేయు; దో
షాపరుఁడైన వంచకుని స్వాంతమునన్ దగ ధర్మచింత వే
దోపఁగఁజేసి నీదుపద తోయజయుగ్మముఁ గొల్వనిమ్ము మా
యాపదలన్నియున్ దొలఁగు నంతట దేవర జానకీవరా.

ఉ॥ కాయముశాశ్వతంబుగ జగంబుననిల్చునె యద్ది బుద్బుద
ప్రాయమయుంచెఱింగియును వంచకుఁడాశకు బద్ధుఁడై పశు
ప్రాయుఁడునై పరార్థమును వంచనసేయఁదలంచి తా మహా
రవముఁ బొంది కుందుఁగద భక్తజనావన జానకీవరా.

మ॥ అనృతాలాపములాడి యాశకువశుండై నీతి వర్జించి పా
వనవేషంబునుదాల్చి యిచ్చకములన్ భాషించి యత్యంతమున్
ప్రణయంబున్ ప్రకటించి వేశ్యవలెఁబైపై వన్నెలన్ జూపినం
తనె లాభించునె జానకీ రమణ భక్తత్రాణ నారాయణా.

అతివినయంబుధౌర్త్యమను న్యాయ్యమునన్ వినయప్రవృత్తులన్
ఇతరులమోసపుచ్చి కపటేంగితవృత్తిఁ జరించుచున్ నిజో
న్నతిఁబ్రకటించుకొంచు సదనంబునకున్ "దయసేయు"డంచుఁబం
డితులకు నాసఁజూపి పొగడించుకొనుంగద వంచకుండు; త
త్కృతులఁ దృణీకరించి యడకింతురు సూరులు జానకీపతీ.

అనయంబున్ వినయంబుఁజూపి గృహమందల్పోపహారాదులన్
తన యౌదార్యమొకింతచూపి పరనిందన్ జేసి యాత్మస్తుతిన్
తనయౌన్నత్యముఁజెప్పుకొంచుఁ బరులన్ వంచింపఁగాఁజూచు దు
ర్జను చౌర్యక్రియ సాగనీయకుము శ్రీరామారఘూత్తంసమా.

శా॥ సీతాహస్తసరోరుహద్వయమునన్ జెల్వొందు పుష్పంబులై
బైతేయ ప్రభు శీర్ష పర్వతములై ధాత్రీ శిరోభూషణ
ఖ్యాతింగాంచెననంగ నొప్పెసఁగు భక్తత్రాణ దీప్తాపదా
బ్జాతద్వంద్వము సంస్మరించి నిను సంభావింతు సీతాపతీ.

శా॥ నీపాదాంబుజ ధూళి దాకినయెడన్ నిర్జీవ ముజ్జీవమై
పొపారున్, భవదీయనామసుధ నోక్కింతేనియున్ గ్రోలినన్
పాపాత్ముండుఁబవిత్రుఁడైసుజనుఁడై భాసిల్లు భూమిస్థలిన్
శ్రీపాలా గుణలోల నిన్ను సతమున్ చింతింతు సీతాపతీ.

శా। ఆదిన్ పావన నారదాది మునివర్య స్వాంతగేహంబులన్
పాదుర్భావమునొంది వాయుసుతహృత్ప్రాసాద వీథిన్ శుభ
శ్రీదైవాఱ రహించి భక్తహృదయ క్షేత్రంబులన్ భాసిలెన్
నీదివ్యాకృతి; నాకుఁజూపుము హృదిన్ జింతింతు సీతాపతీ.

చ॥ నడచిన శయ్యఁబండు కొనినన్, వినినన్ దనివోన నన్నమున్
గుడిచిన, నావులించిన, నకుంఠిత కష్టము లావరించినన్
తడఁబడినన్ మఱెట్టి తరుణంబుననైనను నీదు నామమున్
దడయక సంస్మరించెదఁగదా రఘునాయక సౌఖ్యదాయకా

శా॥ హింసాసక్తిని నన్యజీవముల నే హింసింపలేదెన్నఁడున్
మాంసాహారము మద్యపానముఁ బ్రశంసన్ జేయలేదో రఘూ
త్తంసాయంచు నినున్ స్మరించి సతమున్ ధ్యానించి ప్రార్థించెదన్
సంసారార్ణవతారణా గుణగణా నారాయణా రాఘవా.

ఉ॥ జిష్ణుసహిష్ణు విష్ణు నినుఁ జిత్తమునందు స్మరించుచుందు తు
తృష్ణలఁదీర్చునప్పుడు ధృతిన్ కృతులన్ విరచించునప్పు శీ
తోష్ణములన్ సహించునపు డుగ్రరుజల్ దరిఁజేరకుండ శ్రీ
కృష్ణ! హరీ! మురారి! నృహరీ! కరుణింపుము జానకీపతీ.

మ॥ నినుభావించి భజించు సేవకులకున్ నిత్యంబు విఘ్నంబులున్
ధననష్టంబు సహింపఁగాని సరణిన్ గష్టంబుఁ బ్రాప్తించునాన్
విని యేమోయనుకొంటి, నాయెడ ధ్రువంబేయయ్యెనోఁగాక యే
నను వాఁడన్ కలనైన నిన్ విడువ రామా భక్తసంరక్షకా.

ఉ॥ అంతములేనివాఁడ వ యనంత! యనంత కృపాసుధా రస
స్వాంతములేనివాఁడవ దయాహృదయా! సుమనస్సరోజ భా
స్వంత! సమస్త సద్గుణ నిశాంత ననున్ గరుణింపుమా రమా
కాంత! జగద్విహార! శితికంఠసుహృద్వర! జానకీవరా!

ఉ॥ శిష్టుల సాధుసజ్జనుల క్షేమము నిల్పి జగన్ని కృష్టులన్
దుష్టులఁ జక్కఁజేసి పడఁ ద్రొక్కిన ధర్మముఁ బ్రోచి భక్తులన్
హృష్టులఁజేయఁగా నవతరించెద నంచు వచింపవే మత
భ్రష్టుల మమ్ముఁబ్రోవుము కృపాకర శ్రీకర జానకీవరా.

చ॥ అనిశము నీదు నామ సుధ నానెద రామకృపాహి కేవల
మ్మని మది నన్యచింత విడనాడి స్మరించెద నెమ్మనంబునన్;
వినునది వ్రాయియునట్టిదియు నీదు చరిత్రమ, కన్నులార నిన్
గనునదియెన్నఁడో చెపుమ కారుణికోత్తమ జానకీవరా

అణువునుమించు సూక్ష్మమగు నాకృతి నంతట నిండి యుండు వా
క్షణమున మేరుపర్వతము కంటె మహత్తర రూపివౌదు, నీ
గుణముమహాత్త్వమెంతయు నిగూఢముమూఢుఁడెఱుంగునే శివ
ప్రణుతపవిత్రనామ!రఘురామ!దయా హృదయామహోదయా.

కం॥ భయమణఁచి యాశ్రితుల కా
శ్రయ మొసఁగదవేల చింత సద్భక్తులకున్
శయనీ కృతాహి కాంతా
నయనీ కృత పుష్పవంత నతహనుమంతా!

కం॥ వ్యయముండునె భక్తుల క
వ్యయయని నిను సంస్మరించి నంతనె నాపై
దయఁగల సీతా కాంతా
నయనీకృత పుష్పవంత! నత హనుమంతా.

కం॥ నయమున సుజనుల, గుజనుల
భయమునఁ గడుఁ జక్కఁజేయు వాఁడవు గదరా
రయమున నన్నుఁ గాపాడుము
నయనీకృత పుష్పవంత నత హనుమంతా.

కం॥ నీపాద పద్మ భక్తుని
గాపాడఁ బ్రతిజ్ఞ నీవు గైకొని యుండన్
పాపాత్ముఁ డెవఁడు కష్టం
బాపాదించు రఘురామ యాహవ భీమా.

శా॥ గానాకర్ణన కారణంబునను దుఃఖంబుండ దారీతినే
నీనామంబు స్మరించు మాత్రమున నిర్ణిద్ర ప్రభావంబు బ్ర
హ్మానందంబు లభించు భక్తులకు; నార్య శ్రేణి భాషింపవో
ఆనందంబది బ్రహ్మమంచు రఘురామా భక్త సంరక్షకా.

మ॥ చిరకాలాభ్యసనీయ మైనది ధ్వని శ్లేషాద్యలంకార భా
సురసాహిత్యము; నీదు పావనకథా స్తోత్రోపయోగంబునన్
సరసుల్ మేలనునట్లు లోకమున నాచంద్రార్కమున్ పండిత
స్మరణీయంబయి నిల్చుఁగాదె రఘురామా భక్తసంరక్షకా.

దాస్యుఁడు దైవమున్ పలువిధంబుల నెంచిన నెంచుఁగాక తాఁ
జేసిన సేతకున్ ఫలము చేకురకున్నె యటన్న నిన్ సదా
భ్యాసమునన్ స్మరించు పదభక్తుఁడు సౌఖ్యములన్ శుభంబులన్
భాసిలు టొప్పుఁగాదె గుణభద్ర రఘూద్వహ జానకీవరా.

ఉ॥ మాధవ నిన్నెఱింగిన యుమాధవుఁడెంతటి భక్తుఁడో త్వదా
రాధన తత్పరుండు, రఘురామ! దయానిధియంచు నిన్ జగ
న్నాథుని సంస్మరించి యవినాశనుఁడై సముఁడయ్యె; నా
వేధయు మిమ్మెఱుంగఁ డవివేకి యెఱుంగునె జానకీవరా.

ఉ॥ నీనగుమోముఁజూచిన మనీషులలో ఘనుఁడగ్రగణ్యుఁడ
వ్వానరనాథుఁడేగతి భవత్పదభక్తి గ్రహించె నేగతిన్
దానవులన్ వధించి సుజనప్రియుతుండయి యిజ్జగంబునన్
మానవ పూజలన్ గొనియె మాధవ! నీదయఁగాక రాఘవా!

ఉ॥ అంతట నిండియున్న పరమాత్ముఁడ వీవని విశ్వసించి ని
న్నెంతయు సన్నుతించి భజియించి స్మరించెద నెమ్మనంబునన్;
స్వాంతము బుద్ధి నీయదియ నాదగు దేహము నీదు గేహ మ
శ్రాంతముఁగాచుకొమ్ము రఘురామ! దయాహృదయా మహోదః

ఉ॥ ఆదిని సత్కవీంద్రుఁ డొకఁ డక్కనిఁగొల్చిన యంత నే రుజా
బాధ తొలంగె; నర్కుఁడు భవన్నయనంబు, నినున్ భజించినన్
వ్యాధి తొలంగకున్నెయని యాత్మఁగడుంగడు విశ్వసించితిన్
శ్రీదయితా! దినేంద్ర కులశేఖర! శ్రీకర! జానకీవరా.

చ॥ ఇలను జనించినట్టి నరుడెవ్వఁడు పావనుఁడై రహించు నే
పొలుపుననైన లోపములఁ బొందుటఁ బాపమొనర్చి తాపమున్
గలిగి యనేకకష్టములఁ గాసిలి, నిన్ను భజించి యుత్తముం
డలఘుఁడనంగ నొప్పును యథార్థమెఱుంగవె జానకివరా.

చ॥ పుడమిసమస్తదోష పరిపూరితమౌట యథార్థమిబ్భువిన్
పొడమిన వాఁడెవండు పరిపూతుఁడు పాపమొనర్పకుండు; నీ
యడుగుల గొల్చినంతనె దురాత్ముఁడిలన్ సుకృతాత్ముఁడౌఁగదా
వడిననుఁబ్రోవుమా పతిత పావన శ్రీవర జానకీవరా.

చ॥ ఎలమిని సంస్మరించి నుతియింపఁ బవిత్రుఁడ వీవొకండవే;
ఇలను జనించినట్టి నరుఁడెంతటి వాఁడయినన్ బవిత్రుఁడే?
తలఁపు మఱొండు దక్క నిను ధ్యానముఁ జేసెద నిన్ దలంచి లో
వలరెద నన్నుఁ జూడుము దయాకర శ్రీకర జానకీవరా.

గీ॥ అఘము లుండునె యాధియుఁ వ్యాధియున్నె
ప్రార్థనముఁ జేసి శ్రీరామ రక్ష యనుచు
నిను స్మరించిన వానికి నిరుపమాన
తారకబ్రహ్మనామ కోదండరామ.

ఉ॥ రక్తికిఁ జిక్కి దుర్వ్యసన రాశికి స్రుక్కి విమోహితాత్ముఁడై
భ్రాంతికి నై దురాత్ములకు మ్రొక్కి వివేకముఁ దక్కి దుష్క్రియా
సక్తిఁ జరించు వారలకు శ్రద్ధయు బుద్ధియు శుద్ధియున్ మన
శ్శక్తియు నెట్లు చేకురును సాధుజనావన జానకీవరా.

ఉ॥ అస్మదరాతి షట్కము నిరంతరమున్ జెలరేగి నీదు నా
మస్మరణంబు సేయుతఱి మానసమున్ విచలింపఁజేయు నే
నా స్మరఘుస్మరున్ గొలిచి యాయరి షట్కముగెల్చి పాపమున్
భస్మముఁజేయఁ దోడ్పడుము భవ్యగుణాకర జానకీవరా.

ఉ॥ ఆమయతాపవహ్ని జనితాధికతృష్ణ యొకింత నీదు నా
మామృతమున్ నిరంతరము నానినయంత శమింపకున్నె; నా
కామితమున్ గ్రహించి ననుఁగావవలెన్ కరుణన్ ఘనాఘన
శ్యామల కోమలాంగ మునిచంద్ర హృదంబుజ భృంగరాఘవా.

ఉ॥ పేర్చియనేక కష్టములు పెక్కు విధంబుల నావరించినన్
ఓర్చినవాఁడు ధన్యుఁ డగు నోయి యటంచు నొకింతనన్ను నో
దార్చెదవేమొ? యోర్చిహృది ధైర్యమొకించుక చిక్కఁబట్టి నీ
యర్చనకున్ గడంగితి దయాకర శ్రీకర జానకీవరా.

చ॥ అనిశము జన్మవాసనల కావిలమై హృదయంబు దుష్పథం
బునఁ జనుఁగాక నిన్ను సతమున్ మదిఁగొల్చి భజించునట్టి భ
క్తునకు నఘంబులంటవని కోవిదులందురు నిక్కువంబ యా
నని మది విశ్వసించితి దయాకర శ్రీకర జానకీవరా.

శా॥ లీలన్ లోకములన్ సృజించి వివిధ క్లేశంబులన్ గూర్చి మా
యా లీఢంబగు ఘోరసంసరణ నామాంభోనిధిన్ ద్రోయఁగా
నేలా? నీకది మేల చెప్పుపుగదా? యేవేళ నిన్నాత్మలో
నాలోచించెదు నన్నుఁబ్రోవవలె రామా! భక్త సంరక్షకా.

ఉ॥ శ్రద్ధవహించి సర్వజన సన్నుతమైన భవచ్చరిత్రమున్
బుద్ధిదలంచి లోకమునఁ బుట్టి యొనర్చిన దోషమున్ మ
శ్శుద్ధిని జక్కఁజేసి, ధృతి సుంతయుఁబాయక నీదునాజ్ఞకున్
బద్ధుఁడనై మెలంగెదఁ గృపన్ దిలకింపుము జానకీవరా

సీ॥ దయయుంచి ప్రోవుమా దాశరథీ దివ్య
కరుణాపయోధి ధీ శరధి యనుచు
శరణంటెఁ జూడుమా సద్భక్త మందార
బృందారకనుత గోవింద యనుచు
కరుణింపుమా రామ కామారినుతనామ
సామీరిసేవిత స్వామి యనుచు
రక్షింపు మాది నారాయణా క్షీరాబ్ధి
శయన సితాంభోజ నయన యనుచు

గీ॥ నిన్ను వినుతించు నన్ను మన్నింతు వేని
నీకు సగుణము సుగుణమౌఁ గాకయున్న
నిర్గుణము దుర్గుణంబగు నిరుపమాన
తారకబ్రహ్మనామ కోదండరామ.

చ॥ తరుణము మించివచ్చినను ధైర్యముబాయక నీదునామ స
స్మరణమొనర్చి సంసరణ వారిధినుండి తరింప దైవమే
శరణము పౌరుషంబరయ సాధనమే యని నిన్ను భక్తి వి
స్ఫురణమునన్ భజింతు ననుఁబ్రోవుము శ్రీకర జానకీవరా

ఉ॥ అండజవాహనా! శత సహస్ర కరుండవొ లక్షకోటి నే
త్రుండవొ నిర్బుదాధిక పదుండవొ యంతకు మించు దివ్య శీ
ర్షుండవొ యద్భుతంబయిన రూపము నీ యది యిట్టిదంచు నె
వ్వండు వచించు రామ భవబంధ విమోచన పద్మలోచనా.

సీ॥ భవబంధనము బాపు పరమాత్ముఁడవు నిన్నుఁ
దరిసి బంధింప బంధనము గలదె?
శర్వ సన్నుత సర్వ శక్తి యుక్తుఁడవు నిన్
యుక్తిచే లోఁగన శక్తి గలదె?
ఐశ్వర్యముల నిచ్చు విశ్వేశ్వరుఁడవు నిన్
గొని కింకరుం జేయ ధనము గలదె
ధర్మంబు స్థాపించు ధర్మదేవతవు నిన్
ధర్మజ్ఞుఁ జేయు శాస్త్రంబు గలదె

గీ॥ అన్నిటికి నాకుఁగల దొక్క యాయుధంబు
భక్తియను దివ్యసాధన శక్తి వలన
నిన్ను లోఁగొందు నన్ను మన్నింపు మెందు
తారకబ్రహ్మనామ కోదండరామ.

మ॥ తెలియన్ జాలవుగాక సంశయమునన్ దేహేంద్రియాతీత చి
త్కళతో రాజులు నాత్మ నేన సుఖదుఃఖంబుల్ మదాధీనముల్
కలఁతన్ బొందకుమంచు గూఢతరవాక్యంబొందు భాషింతువో
మలినాత్ముండు గ్రహింపలేఁడు రఘురామా భక్తసంరక్షకా.

ఉ॥ నా యపరాధకోటి యొకనాఁడయినన్ ఓడనాఁడవో జగ
న్నాయక భక్తదోష సహనంబు విధాయకమంచు ధర్మసం
ధాయక నీవెఱుంగవో సతంబును నిన్ను భజించు భక్తులం
బాయకప్రోవగావలె నమాయిక! యాశ్రిత సౌఖ్యదాయకా

మ॥ కలికాలంబున సాధుసజ్జనులకున్ కష్టంబులున్ నష్టముల్
గలుగున్, శ్రేయములైనకార్యముల విఘ్నంబుల్ ఘటిల్లున్ విని
శ్చలబుద్ధిన్ కృతి నిర్వహింపుమని యాశ్వాసింతువేమో? విని
ర్మలచిత్తుండనటే సహించుటకు రామా భక్తసంరక్షకా.

చ॥ సనకసనందనాదిముని చంద్రులు వాయుసుతాది భక్తులున్
వనరుహసంభవాది సురవర్యులు నిత్యమనేక భంగులన్
నిను వినుతింతు రట్టియెడ నీశ్రవణంబుల కెట్టులెక్కు నా
వినుతియు మొఱ్ఱయున్ దనుజ వీర భయంకర జానకీవరా.

గీ॥ పరమపురుషుండ వాశ్రిత వత్సలుఁడవు
నిత్యము నమస్కరించెద నీ యమోఘ
రోపమునకును నీనామ రూపములకు
రామ గుణధామ తారక బ్రహ్మనామ.

చ॥ సుకృతికిఁగాక యన్యునకుఁ జొప్పడునే భవదీయ దివ్య పా
దకమలసేవ, నిన్నుమది ధ్యానముఁజేసి భజించుచున్ మనో
వికృతిఁద్యజించి యెవ్వఁడు తపించునొ వానికసాధ్యమున్నదే
ప్రకృతి వినోద తత్పర పరాత్పర శ్రీకర జానకీవరా.

శా॥ కామ్యంబిచ్చి సుఖింపఁజేసి భవదుఃఖంబున్ నివారింపఁగా
సామ్యంబున్నదె యంచు, దుస్తరమహా సంసారవారాశిలో
గమ్యస్థానముఁజేర్చు నావయగు నిక్కంబంచు, భక్తాళికిన్
రమ్యంబంచు స్మరింపనొప్పు సతమున్ రామా భవన్నామమున్.

గీ॥ శాస్త్రములునౌషధంబులు శస్త్రములును
నరులఁగాపాడఁజాలునే తరుణ మరసి
కరుణఁ జూపింపవలె నీవు నిరుపమాన
తారకబ్రహ్మనామ కోదండరామ.

అరయన్ చందురుఁడోషధీశుఁడను ప్రఖ్యాతిన్ ప్రకాశించు భా
స్కరుఁడారోగ్యమొసంగు దేవత యనంగా రాజిలున్ వీరలి
ద్వరునేత్రంబులునీకు, భక్తులకు నారోగ్యంబు చేకూరదే
కరుణన్ జూచిన నీవు దేహమున రోగంబుండునే రాఘవా.

ఉ॥ "నమ్మిన వేడ్క నీచరణ పద్మములన్ మదిఁగొల్చి నీదు నా
మమ్ము స్మరించి నీకథల మాధురిఁగ్రోలి యహర్నిశంబు నిన్
నమ్మిననన్నుఁబ్రోచి "రఘునాథుఁడు రక్షకు"డన్ యశమ్ము లో
కమ్మున నిల్పుకొమ్ము సితికంఠ సుహృద్వర జానకీవరా.

ఉ॥ రామగుణాభిరామ జనరంజననామ భవత్పవిత్ర నా
మామృతమాను భక్తులకు నాధులు వ్యాధులు లేకయుండినన్
నీ మహిమంబు లోకమున నిత్యము సంస్మరణీయమై యశో
ధామము నై రహించును గదా ననుఁబ్రోవుము జానకీపతీ.

నినుధ్యానించి భజించు భక్తుఁడెపుడేన్ నిశ్చింతతోనుండు, లో
ననుమానింపఁడు కీడుమూడునని ధైర్యంబెన్నఁడున్ బాయఁడే
పనిఁగావించినఁబొందఁడెన్నఁడు నహం భావం బహంకారమున్
అనఘా! సర్వగుణాభిరామ రఘురామా భక్తసంరక్షకా.

మ॥ తనయత్నంబుఁబరిత్యజించి భగవత్సంకల్పమెట్లున్నదో
యని యశ్రద్ధవహించుఁగాక యలసుండాత్మీయకార్యంబులన్
నిను నిక్కమ్ముగ నమ్మికొన్నయెడ సందేహింపనేలా యతం
డనపాయంబుగ నుండుఁగాదె రఘురామా భక్తసంరక్షకా.

ఉ॥ నీయసమానవిక్రమము నేర్చినభంగి నుతించి సజ్జన
ధ్యేయముగానొనర్తు నిపుడెమ్మెయి నాథులవ్యాధులన్ మెయిన్
బాయఁగఁజేసి వీరరస భాండమునాఁదగు యుద్ధకాండమున్
వ్రాయఁగనిమ్మనంతరముఁ పట్టముఁగట్టెద నీకు రాఘవా.

మ॥ మునుభక్తుల్ నినుగొల్చి వ్రాసిరి జగంబుల్ మెచ్చ నీదివ్యకీ
ర్తనకావ్యంబుల; నెవ్వరెన్నిగతులన్ ధ్యానించినన్ వ్రాసినన్
అనురక్తిన్ పునరుక్తిదోషమగునే? యాసక్తి నీశక్తి భ
క్తిని భాషించెద భక్తకోటియలరన్ కీర్తించెదన్ రాఘవా.

ఉ॥ నే భవదీయదివ్యపద నీరజయుగ్మము సంస్మరించియున్
లాభముఁబొందలేదని తలంతునె? సంచితపాప సంచయ
క్షోభమణంగ సౌఖ్యమొనగూడక యుండునె సర్వదోషమ
త్తేభమృగేంద్ర, యానతసురేంద్ర! యుపేంద్ర నృపేంద్ర, రాఘవా.

భృగువంశంబునబ్రాహ్మణుండవయి యావిర్భావమున్ బొంది యి
తిన్ బ్రోవఁగ ధర్మమున్ నిలుప నిష్కామంబునన్ క్రోధివై
సాధించినఁ దప్పు లేదనుచుఁ దెల్పన్ పాపులన్ భూపులన్
ఖండించిన నీపరాక్రమముఁ బ్రస్తావింతు సీతాపతీ.

మ॥ ననుభావింపుఁడు, స్వల్పజీవిబలహీనంబంచు నూహింప రా
నయంబంతట నిండియుండునను న్యాయ్యంబొందు బోధింపఁగా
నుజాటోప మణంగఁగా శఫరివై తామేటివై పందివై
మునతన్ గాంచితివీవు; నిన్ బొగడ శక్యంబా నె సీతాపతీ.

కు॥ పరులన్ గెల్వఁగ నాహవోప కరణవ్రాతంబు లేకున్న, వా
నరులైనన్ నరభుక్కులన్ గెలువనౌ నన్ నమ్మినన్ జాలు ని
వరనల్పుండు బలాఢ్యుఁడై మెలఁగుఁదథ్యంబంచు బోధింపఁగా
వరనాథాన్వయ సంభవుండవగు నిన్ ధ్యానింతు సీతాపతీ.

మ॥ ఘనులన్ సత్పథవర్తులన్ విబుధులన్ గాపాడ దుర్మార్గ దు
ర్జనులన్ వంచకులన్ మనోజ్ఞమగు వేషంబూని వంచించినన్
దనకున్ దోషము గల్గదంచు నమృతాంధశ్రేణిఁబోషింప మో
హినివై దైత్యుల మోసపుచ్చితివి నిన్నేమందు సీతాపతీ.

గీ॥ పొట్టివానికిఁబుట్టెడు బుద్ధు లనెడు
న్యాయ్యమును సార్థకముఁ జేయ నవనియందు
వామనుండవై బలిచక్రవర్తి నణఁచి
నట్టి సీతాపతీ నిన్ను నభినుతింతు.

శా॥ కారాగారమునందుఁ బుట్టితి విలన్ గాపాడనూహించి రేన్
కారాగారము జన్మదేశమువలెన్ గాంక్షింపుఁడన్నట్లు, మే
మారంభించిన యుద్యమంబు సఫలంబౌఁగాక నీయుక్తిచే
నారాధింతుము రామ కృష్ణయని నిన్నాశ్రితమున్ రాఘవా

మ॥ కరయుగ్మంబు వణంకయుద్ధమునఁ గింకర్తవ్యతామూఢుఁడౌ
నరునిన్ ధీరునిఁజేసినాడవు గదా జ్ఞానోపదేశంబునన్
పరమార్థంబులభింపదే నరులు నిన్ ప్రార్థించి పూజించినన్
పరమాత్ముండవు విశ్వరూపుఁడవు నిన్ భావింతు సీతాపతీ.

ఉ॥ బుద్ధిరవంతలేని పెనుమోఱకు లూఱక జీవహింసచే
వృద్ధినిబొందఁజూచెదరు ప్రేమముదక్క, యహింసచే మన
శ్శుద్ధియు మోక్షసిద్ధియును జొప్పడునంచు వచించినట్టి యా
బుద్ధుఁడవీవయంచును ప్రబుద్ధమతిన్ వినుతింతు రాఘవా.

ఉ॥ కాయముబుద్బుదంబయగుఁగాక యథార్థమెఱింగి దోషమున్
జేయనివాఁడెవండు నినుజిత్తమునందుఁ దలంచి సత్యముల్
జే యని మ్రొక్కువాని నతిశీఘ్రగతిన్ గతజన్మదోషముల్
పాయక యుండునే పతిత పావన శ్రీవర జానకీవరా.

మ॥ నిరతిన్ బుద్ధి స్థిరంబుగానిలిపి నిన్ సేవింప భావింప దు
స్తర మాయావరణంబు కారణమునన్ శక్తుండగానైతి నే
వరుసన్ బ్రోచెదొ? యిందునందుసుఖియింపం జేయుసీనామమున్
పరమార్థంబనియెంచినాడఁజుమి రామా భక్తచింతామణీ.

మ॥ శత్రుత్వంబొకయింత లేదనుచుఁ బ్రస్తావించి ప్రఖ్యాత స
త్రుండయ్యును నీచుఁడై మెలఁగి నాఁడున్ నష్టమున్ గూర్చెనా
త్రిద్రోహిని నేమిసేయవలె నీమీఁదన్ విచారింపు మే
మాత్రంబైన సహింపరాదిఁకను రామా భక్తచింతామణీ.

॥ సచ్చరితంబు సర్వజన సమ్మతమంచుఁ దలంచి నీకథన్
మెచ్చి రచింపఁబూనితిఁ జుమీ తలపోయక కష్టనష్టముల్
దెచ్చిన నేమిసేయుదుఁ గృతిన్ విరచించుటమాని తెంపుమై
నిచ్చకు వచ్చినట్లు చరియింతు స్వతంత్రత జానకీవరా.

ఉ॥ కంటఁగృపారసంబొలుకఁ గాంచెదవంచుఁ దలంచి డెందమం
దంటెనభక్తి సిన్ గొలిచినంతనె వెంటనె చేకురెంగదా
ఇంటనుకష్టనష్టము లొకించుకయున్ దలపోయవక్కటా
ఒంటను వ్యాధి నేగతి మహోపకృతిన్ వినుతింతు రాఘవా.

శా॥ ఈరోగంబున కెవ్విధౌషధము లం చేలా విచారింపఁగా
సారంబైనది రామనామసుధ విశ్వాసంబునన్ గ్రోలెదన్
శ్రీరామా సుగుణాభిరామ యనుచున్ చింతించి సద్భక్తితో
నారాధించెద నిన్ను రాఘవ శరీరారోగ్య మేపారగన్.

ఉ॥ పావని నీసహోదరుని ప్రాణముఁ బ్రోవఁగ సత్వరంబ సం
జీవినిదెచ్చె నాతని కజేయ పరాక్రమ మెట్టులబ్బె నీ
పావన నామమంత్రము ప్రభావము నంగద రామచంద్ర భ
క్తావన జీవనా గుణగణా ననుఁబ్రోవర జానకీవరా.

ఉ॥ పాయనిభక్తిమైఁ గొలుచు భక్తుల నెల్లరఁబ్రోచు సత్యనా
రాయణమూర్తి వీవతి భయంకరరోగముఁబాప సూర్యనా
రాయణమూర్తి వీవని నిరంతరమున్ భజియింతు నాది నా
రాయణ భక్తరక్షణ పరాయణ శ్రీకర జానకీవరా.

ఉ॥ రామయనంగ సర్వజన రంజననామ యనంగఁ జిత్కళా
ధామయనంగ లోకహిత ధర్మపథావనకామ సద్గుణా
రామయనంగ దుర్జనవిరామ యనంగ నెవండు? మామకున్
మామయనంగ నెవ్వఁడొకమాట వచింపుము జానకీవరా.

శా॥ చేతోవీథి నినున్ దలంచుకొని నిన్ సేవింప నుత్సాహినై
నీతోడ్పాటునఁగాదె యింతదనుకన్ నీగ్రంథమున్ వ్రాసితిన్
ఏతన్మాత్రుఁడనయ్యు; వేగముగ నెట్లేఁబూర్తిఁ జేయింప వా
హా తండ్రీ రఘురామ చంద్ర దయలేదా మాటఁదక్కింపవా.

సీ॥ శిష్టుఁడంచును చిరంజీవిఁ జేసితివీవు
కపివర్యుఁడేపాటి కలిమి యొసఁగె
నీమెప్పులంగాంచి నీలోకమున్ జొచ్చె
శబరి యేపాటి యైశ్వర్య మొసఁగె
ప్రాణాధికుండంచు నాదరించితివార
యాకుచేలుండెంత యర్థ మొసఁగె
నినుఁదలంచెనో లేదో కనికరించితివీవు
పాంచాలి నీకెన్ని వలువ లొసఁగె

గీ॥ భక్తసులభుండ వనుచు నిన్ భక్తిఁ గొలిచి
సన్నుతించితిఁ గాక, కష్టములఁ గూర్చి
ననుఁ బరీక్షింపఁ దలఁచుట న్యాయ్యమగునె
ప్రహత భవరోగతృష్ణ శ్రీరామ కృష్ణ.

ఉ॥ తలఁప నరుండనుక్షణముఁ దప్పక తప్పులఁ జేయుట బ్రమే
యలఘుఁడు తప్పు జేసినపుడాత్మకృతంబని వెల్లడించు, ద
ప్పులకుఁ గడుంగడున్ బొగిలి పొక్కి తపించు మహాత్ముఁడయ్యెనేన్
కలనయినన్ దొసంగుల నొనర్పఁడు దైవసముండు రాఘవా!.

ఉ॥ ఇమ్మెయిఁ గష్టనష్టముల నెల్ల నణంచి శరీరమందు రో
గమ్ములఁ బాపి విఘ్నములఁ గాసిలకుండ నొనర్చి నాదు భా
వమ్మున నిల్చి నన్నిఁకఁ గృపన్ దిలకించినఁ జాలు నీదు గ్రం
థమ్ము సుపూర్తిఁ జేసి భువి ధన్యుఁడ నయ్యెద జానకీపతీ.

చ॥ భవుఁడవు దుఃఖమో సుఖమొ ఫాలతలంబున వ్రాయు పద్మసం
భవుఁడవు భక్తలోకభవ బాధలఁ బాపఁగ నోపినట్టి మా
ధవుఁడవు సన్మునీంద్రనుత దాశరథీ కరుణాపయోధి! భా
గవతుల నారసింహకవి కష్టవిమోచన పద్మలోచనా.

ఉ॥ ఆద్యుఁడ వెల్ల దేవతల కంచు మహాభవరోగ కోటికిన్
వైద్యుఁడ వీవ యంచు ననవద్యమతిన్ భవదీయ నామమున్
హృద్యగతిన్ దలంచి రచియించి యొసంగితి నీకుఁ బ్రార్థనా
పద్యములన్ శివప్రణుత పద్మదళేక్షణ భక్తరక్షణా.



# పైల్వాను లేహ్యం.



అరగంటలో వీర్యము గట్టిపరచును. సింహముతో పోరాడుదునన్న బలమొసంగును. రక్తముశుభ్రపరచును. పురుషులకు ఉల్లాసమెక్కువజేసి ప్రపంచసుఖమునకు మంచి శక్తినొసంగును. సుఖజాడ్యములు చేరనీయక ఆటంకపరచును మహారణ్యములలో నివసించు యోగీశ్వరులచే గ్రహింపబడిన చిన్నచిటికే. హిమాలయపర్వత వనమూలికలు, అంబరు, శిలాజిత్తు, కస్తూరి, బంగారు మొదలైన అనేకవస్తువులచే సిద్ధపరచితిమి. రస విష గంధకాదులు చేరియుండలేదు. ప్రాణమునకు రక్తమే ఆధారము. అది చెడిన అనేక రోగములకు తావిచ్చును. పురుషులు స్త్రీ వాడి దీనిలోనున్న మహాప్రభావమును ఆదరింతురుగాక. దీని సేవవలన 100 మంది స్త్రీలతో రమింపవచ్చునని శాస్త్రమున చెప్పబడెను. వాడి గుణము లేదన్నవారి డబ్బు వాపసు చేతుము. ఎక్కువగా వర్ణించుట అనవసరము. వర్ణించుటకు దొరతనమొప్పదు. రస విష గంధకాదులు చేరని తియ్యనిముద్ద. క్యాటలాగు ఉచితము. ఆలసించినవారికి దొరకుటదుర్లభము. నేడే కార్డు వ్రాయుండి. 20 దినములకు 25 తులముల డబ్బీ రూ 3 ఖు. పథ్యము లేదు. 2 డబ్బీలపైన పోస్టేజి ఉచితము.

**డా॥ ఏ. ఎస్. మూర్తి కంపెనీ, చికాకోల్.**

# ఖబర్దార్!! బద్మాష్

కథానాయకుఁడు—తటాకపరిసర స్త్రీ హత్యాకుఁ గారకుఁడైన చోరశిఖామణి. ఈ గ్రంథ విశేషాంశములు మునుమున్ను ప్రకటింపఁబడును.

# రఘునాథరావు.

చరిత్రాత్మకమైన నవల. సాధ్యమైనంత శీఘ్రముగ వెలువడును. (ముద్రణములో నున్నది.)

గ్రంథకర్త:- వైద్యుల వెంకట నరసింహారావు.

# శ్రీరామముద్రాణాలయము

## బరంపురం, (గంజాం.)

ఇచ్చట అన్ని విధములగు అచ్చుపనులు—బుక్ వర్క్, ఫారములు, కేలండర్లు, నోటీసులువగైరా, చక్కఁగ, చౌకగ, ముద్రించి సకాలమునకు ఒసఁగఁబడును. ఇంగ్లీషు, తెలుగు, ఒరియాలో ప్రకటనలు ముద్రించి ఈ జిల్లా అంతట ప్రకటింపదగిన యేర్పాటు చేయఁబడును. వెంటనే వ్రాయుఁడు.

భాగవతుల నరసింహశర్మ,

ప్రొప్రయిటర్.